# కలస్వనం

(కావ్య సంపుటి)

గట్టెపల్లి సత్యనారాయణరాజు

ప్రచురణ

తెలంగాణా రచయితల సంఘం

హైదరాబాదు

మొదటి ముద్రణ
వేయి ప్రతులు
నవంబరు 1, 1956.

వెల:
రూపాయిపావలా

ముద్రణ:
సాధనా ప్రింటరీ,
హైదరాబాదు.

ప్రతులకు:
గజ్జెపల్లి సత్యనారాయణరాజు
డెప్యూటీ ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు,
జనగామ (సెంట్రల్ రైల్వే).

# పీఠిక

నేను శ్రీ గజ్జెపల్లి సత్యనారాయణరాజు గారిని చాలకాలముగా నెఱింగియున్నాను. నాకు వీరి ప్రథమపరిచయము విద్యాశాఖలోని యొక డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగా గాక యొకానొక యువకవిశిఖామణి గా మాత్రమే యని సహృదయులకు నివేదించుకొనుచున్నాను.

వీరి యీ బహువిషయ వర్ణనాత్మకమైన ఖండ కావ్యమును బహుమారు వీరి ముఖతః విని యానందించి యిత్తోధికతర మధుర రచనా విశేష ప్రచారములకు వీరిని పెక్కుసారులు ప్రోత్సహించి యున్నాను. వీరి "నాది స్వతంత్ర వృత్తి యయినన్ విడనాడను" అను నీయసాధారణ ప్రతిజ్ఞ నేటికవులలో గేవలము కొందఱికో మాత్రమే ప్రియమైనను. సకలవిద్వజ్జనాదరణీయమైనదని తలంచుటలో గత్యంతరములేదు.

ప్రాచీనుల శైలీగాంభీర్యమును, నవీనులభావ స్వాతంత్ర్యమును, సమ్మిళితములై యీ కావ్యసంపుటిలో వీరి యా ప్రతిజ్ఞాసాఫల్యము నడుగడుగునను జ్ఞప్తి చేయుచున్నది.

ఈ కృతిరత్న మనోహారము మన యాంధ్ర మహాజనని కంకితమై అంజలీనామక విషయ నాయకమణిచే బ్రకర్షము చెంది "పితృదేవోభవ" అన్న ప్రాచీన హైందవ ధర్మమును హెచ్చరించుచు మత్ప్రియమిత్రులు కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారి యమూల్యస్మృతిరూప మాణిక్య విశేషముచే బరిపూర్తి గాంచి ప్రకాశించుచు, సుకృతులకు హృదయహారియగుచుండుట ముదావహము.

ఇట్టి కృతిరత్నములనే కాక కాకతీయ చరిత్రమువంటి మహాకావ్యమును సైతము రచించి యస్మదాదులగు వృద్ధజనులచే నభినందన పురస్సరమైన యాశీర్లాభమును బొందెడుగాకయని యీ కవిని మఱియు ప్రోత్సహించుచున్నాడను.

జనగామ,

7-10-56. అనుముల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

# ఆముఖం

ఆ మధ్య హైదరాబాదు ప్రభుత్వంవారు తెలుగు కవితారచన పోటీ జరిపించారు. అందులో శ్రీ గద్దెపల్లి సత్యనారాయణగారి "పూజ" అనే శీర్షిక గల కవిత ద్వితీయ బహుమానం పొందింది. పత్రికలన్నిటిలో ఆ కవితను ప్రచురించారు. అందరితో పాటు నేనూ చదివాను "ఆ శుభ్ర గీతికారవ మనంత విశాల వినీల నిర్మలాకాశముదాటి" సాహిత్యకులం ఎరికీ పరిచితం అయింది. అటుపిమ్మట అంతకు ముందూ సత్యనారాయణగారు ఎన్నో రచనలు చేశారు. అవి కొన్నికొన్ని వినడానికి సభాముఖాన వీలుకలిగింది. ఆ తరువాత నావలెనే వారూ తెలంగాణా రచయితల సంఘం కార్యకర్తలైనారు. ఆ బంధంవల్ల మేము ఇరువురం పరస్పరం చాలా సార్లు కలుసుకున్నాం. ఆప్తులు శ్రీ ఉరుపుటూరి రాఘవాచార్యులుగారూ, శ్రీ సత్యనారాయణగారూ జనగామ ప్రాంతంలో రచయితల సంఘాన్ని మూడుపూవులు ఆరుకాయలుగా అభివృద్ధిచేశారు. తమ రచనలు చదివి వినిపించి జనానికి సాహిత్యంపైన ఆసక్తిని పెంపొందించారు. శ్రీ సత్యనారాయణగారిది గ్రామ గ్రామం తిరిగే ఉద్యోగం అది సాహిత్య ప్రచారానికి ఎంతగానో తోడ్పడింది. సత్యనారాయణగారి మనస్సు పాలసముద్రం వంటిది. తియ్యని తరంగాలు ఎప్పుడూ లేస్తూ ఉంటాయి. వాటికి శబ్దత్వం కల్పించి ఆయన అమృత గుటికలుగా శోకంపు విసరి సంజ్వరితమైన లోకానికి ఆరోగ్యాన్ని ప్రసాదిస్తుంటారు. నిర్విరామంగా ఆయన చేసే రచనలు భారతివంటి ప్రముఖ పత్రికల్లో ప్రకటించబడినవి ఆయన హృదయపికీ కలస్వనాలు అంతావిన్నవే. అయితే వాటి నన్నిటినీ ఒక్కచోట చేర్చి రేడియోపాటల పెట్టెవలె ఆంధ్రలోకానికి అందించాలనే భావంతో కలస్వనం అనే పేరిట ఈ సంపుటం వేశాము. ఈ సంపుటాన్ని మహాంధ్రావతరణ శుభసమయంలో మహాంధ్రజనులకి అంకితం చేయడం ఎంతో సమంజసంగా వుంది. ప్రతి ఘటనోత్సాహం ఇక్కడి నాలుగు నాళ్లపాటు ఉప్పెనలా పొంగివచ్చినా

నిజానికి తెలంగాణ జనం ఎప్పుడూ విశాలాంధ్రనే కాంక్షించినారు. ముఖ్యంగా కవికుమారులు రాజకీయ కారణాలవల్ల చిరకాలం విడిగా ఉన్న ఆంధ్రప్రాంతాన్ని భిన్న భిన్న భాగాలుగా ఎన్నడూ భావించలేదు. వారు విశాలాంధ్రసాధనకు ఎంతో తోడ్పడ్డారు. ప్రజలలో సుహృద్భావం ఏర్పడడానికి వారిగీతాలు ఎంతో తోడ్పడినవి. ఆ కృషిలో సత్యనారాయణ గారికీ భాగంవుంది.

సత్యనారాయణగారి రచన కడుమెత్తనిది. "కనులరు మోప్పి వేణువు ముఖంబున తేనియలొల్క విశ్వమోహనరివ మాలపించి....... జడముల్ రసార్ద్ర చేతనములు" అయ్యేట్టు చేసే అమృతమయమైన రచనారీతి వీరిది.

"వెన్న పూసల జోక విచ్చిన యక్షరా

రాణి ముత్తెపు పేర్లై రహింప,

పలికిన మకరంద మొలుకు పద్యంబులు

తలపూవులొచు నందాలు విరియ

"నిండు జవరాలి పోలిక"..............

ఈయన కవితాదేవి బహు ఒయ్యారంగా నడుస్తుంది. "విశ్వమానవ కల్యాణ వీధు"ల్లో "సాహితీ తోరణాలు పచ్చగనమర్చి" శ్రీ సత్యనారాయణగారు "మానవాభ్యుదయగీతం" పాడుతున్నారు. నూటికి నూరు పాళ్ళు కవిలు యినవాడు చేసేపని ఇదే.

నా దృష్టిలో ఒక కవి తక్కువ ఒక కవి ఎక్కువ ఎన్నడూకాడు. పాల కడలిలో ఒక తరంగం తీపి ఒక తరంగం చేదూ ఎట్లా అవుతాయి? అయితే సంతతం రచనా వ్యాసంగంవల్ల కొందరి పనితనం రచనలో మిక్కుటంగా, సొగసుగా కనిపించి కళ్లను జిగేలు పెడుతుంది. కాని భావయిత్రీ ప్రతిభ, కారయిత్రీ ప్రతిభ. కవి మనస్సును ఆశ్రయించి ఉంటాయి. వాటి ఔన్నత్యాన్ని, గాంభీర్యాన్ని ఎవ్వరూ కొలవనలేరు. "పరమాణు వందుప్పవంటొ మహాశక్తి, శైలసానువులోని జాలి గుండె" ఈయనలో గూడుకట్టుకుని ఇంతచక్కని రచనలు చేయిస్తున్నది. వీటి పరిణతి యే మహాకావ్యసృష్టికి పురి కొల్పుతుంది.

'కలస్వనం' లోని ప్రతి పద్యపాఠం పాఠకుని హృదయవీణా తంత్రిక మీద చేయితిరిగిన వైణికుని వేళ్ళ నొక్కుడులాగ కలస్వనాలను పలికిస్తుంది.

అయితే నాకెందుకో సత్యనారాయణగారికి కొంచెం కొంచెం తొందర ఎక్కువ అనిపిస్తుంది. వెనక్కు తిరిగి చూసుకునే అలవాటు కొంచెం తక్కువే. గంగా ప్రవాహంలాగ మోకాటిలోతున రాళ్ళు చాలా వస్తాయి. వాటిని ఏరుకునే ఓపిక చాలా అవసరం లేకపోతే చంద్రునిలో కళంకంలా సమస్త లోకానికి ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. "సమ్మెసమ్మె కుసుమా వృతము" "బాలుడనయ్యె" "వేసవ్యాస విలాసమయ్యె" చాలా పెద్దిగా అక్కడక్కడా ఉన్నాయి. వాటిని ఇష్టపడవలసివుంటుందికోవచ్చు. అయితే పైన మనవిచేసినట్లు ఉద్వేగం అలాచేయనివ్వదు. నలభై యేళ్ళుదాటితే గాని ఆ ఓపిక రాదేమో. అయితే ఆ ఓపిక అవసరం అని నేనూ సత్యనారాయణగారూ గుర్తించినాం.

ఈయన పద్యాలలోని మరో విశిష్టత ఏమిటంటే చదువుతుంటే సముద్రమథనం జరిగినప్పటి కల్లోలం కవికి వ్రాసేప్పుడు కలిగి ఉంటుందని పాఠకునికి అడుగడుగునా స్ఫురిస్తుంది. ఇది గీటురాయిగా చూస్తే ఈయన తన రచనల్ని గుండెల్లోంచి చేస్తున్నట్లు దృఢంగా తోస్తుంది. అలాటి రచనయే ఇతరుల గుండెల్లోకి సూటిగా దూసుకుపోతుంది. ఈ గీటు రాయితోనే నేను నా రచనలనూ ఇతరుల రచనలనూ పరీక్షిస్తాను. శాణోల్లీఢమైన రత్నాల్లాంటి ఈయన పద్యాలు "కలస్వనం" పేరుతో మహాంధ్రావతరణ శుభ సమయాన మహాంధ్రజననికి రత్నాల హారంగా విరాజిల్లుతుందని ఆశిస్తూ, శ్రీ సత్యనారాయణగారి అనుపమ ప్రజ్ఞాజలదం ఆంధ్ర సాహిత్యంలో అమృత వృష్టిని ఇతోధికంగా కురుస్తుందని విశ్వసిస్తున్నాను.

దాశరథి

తెలంగాణా రచయితల సంఘం 8వ ప్రచురణగా "కలస్వనం" అందిస్తున్నాము. రచయిత ఈ కావ్యాన్ని తెలుగుల దివ్య స్వప్నమైన మహాంధ్ర మునకు అంకితం చేయడం అత్యంత సముచితంగా ఉంది. పద్యాన్నీ, గేయాన్నీ, లలిత మధురమైన ఫణితిలో నడిపించడంలో సత్యనారాయణరాజు గారు సమర్థులు. తమ యీ కావ్యాన్ని సంఘం ప్రచురణమాలలో ఒక ప్రసూనంగా చేర్చడానికి అందించినందుకు రాజుగారికి కృతజ్ఞతలు. కలస్వనం ఆంధ్ర రసికలోకమును ఆనందింప జేస్తుందని ఆశి స్తున్నాను.

తెలంగాణా రచయితల సంఘం,
హైదరాబాదు.
నవంబరు 1, 1956.

ఇట్లు
సి. నారాయణరెడ్డి,
ప్రధాన కార్యదర్శి

# కృతజ్ఞత

నా "కలస్వనము"ను విని ఆనందించి ఇంతోధికకృషికై నన్ను ప్రోత్సహించుచు తమ అమూల్యాభిప్రాయముల నొసంగిన, పూజ్యులు "అభినవ తిక్కన" శ్రీ అనుముల సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి;

నేను కోరినంతనే ఈ కావ్యమును ఆమూలాగ్రముగ చదివి ఇందలి తరుగు మెరుగులను తెలుపుచు ముక్కోటి మనస్సు లొక్కటిజేసి పీఠిక వ్రాసిన, "మహాకవి" శ్రీ దాశరథిగారికి;

నన్నీ కృషికై ప్రోత్సహించి అన్ని యాటంకముల నెదుర్కొని, మహాత్ముని జన్మదినమున "కావ్యాంకితోత్సవము"ను జరిపించిన "వెలుగు" పత్రికా ప్రకాశకులు శ్రీయం. మధుసూధన్ రావు గారికి;

పిలువగనే నిండు మనస్సుతో దయచేసి అంకితోత్సవమును జయప్రద మొనరించిన సాహితీ బాంధవులు తెలంగాణ రచయితల సంఘాధ్యక్షులునగు, శ్రీ "కాళోజీ" గారికి;

ఆంధ్రజనతా సంపాదకులు శ్రీ సుబ్రహ్మణ్యం గారికి; కివి సన్మాన రూపకంగా ముద్రణకు ద్రవ్య సహాయ మొనరించిన సాహితీ ప్రియులు, జనగామ వైశ్య సంఘాధ్యక్షులగు, శ్రీ పెద్ది నారాయణగారికిని, తెలుగు పత్రికా సహాయ సంపాదకులగు, శ్రీ రాయచూరు రాఘవేంద్ర రావుగారికి, జనగామ తాలూకా కాంగ్రెసు సహాయ కార్యదర్శి శ్రీ చెన్నమాధవుని నారాయణ రాజు భట్టుగారికిని;

తలమ కొన్నంతనే దర్శనమిచ్చి తెలంగాణా రచయితల సంఘము పక్షాన, ఈ కావ్య ప్రచురణా భారమును వహించిన మిత్రులు శ్రీ ఉదుప్పుటూరి రాఘవాచార్యుల గారికి;

దీనిని తెలంగాణా రచయితల సంఘము పక్షాన, వెలువరించుట కంగీకరించిన ఏతత్సంఘ కార్యకర్తలకు; ముద్దుగా ముఖ చిత్రమును చిత్రించి యిచ్చిన ఆర్టిస్టు శ్రీ కె. వేంబు (విజయవాడ) గారికి; సకాలమునకు దీనినందముగా నచ్చొత్తించి యిచ్చిన సాధనా ప్రింటరి వారికి;

కృతజ్ఞతా పూర్వక నమోవాకములు.

రచయిత

# దీనిలో



# అంకితము

శ్రీమదాంధ్ర సరస్వతీ స్నిగ్ధచరణ
కలిత మంజీరరవము దిక్కులఁ జెలంగ
నవనవోన్మీలిత కలస్వనంబు నిదిగొ !
అంకిత మొనర్తు నీకు మహాంధ్రజనని !

ఓ నవరాగ విస్ఫుట మహోదయశీల, మదీయ భావనో
ద్యానము నందు క్రొంజిగురుటాకుల రాక లెఱింగి యిత్తుసి
కానుక మవ్వపుం దెనుగు కావ్యముగా సవరించి, నీ యశో
గానము నందిదొక్క గమకంబయి నిల్చిన నే కృతార్థుడన్.

కోటి తమ్ములు తమ రెండు కోట్ల తెనుగు
టన్నలను గూడి యొక యింట నలరు నాడు
అమ్మ కొక కాన్క యిచ్చు భాగ్యమ్ము నాకు
కలిగినది యెట్టి సుకృతముల్ సలిపి నానొ !

# అంజలులు

కను లరమోడ్చి వేణువు ముఖంబున దేనియ లొల్క విశ్వమో
హన రవ మాలపించిన, తదాకలనన్ జడముల్ రసార్ద్రిచే
తనములు వొందుచున్నిరిగి తన్మయతన్ జడవృత్తి సూప, చె
క్కున కరమద్ది నవ్వుకొను గోపకిశోరున కంజలించెదన్

వెన్నపూసల జోక విచ్చిన యతురా
లాణి ముత్తెపు పేరులై రహింప
పలికిన మకరంద మొలుకు పద్యంబులు
తల పూవులౌచు నందాలు విరియ

ఇరుల బోద్రోలు వ్యాకరణ మంగళసూత్ర
నియమంబు కల్యాణనిష్ఠ దెలుప
నవరసోత్కట కావ్య నాటకాలంకార
గరిమంబు మంజుల కాంతి బెనుప

బహు జనస్తోత్ర సౌభాగ్య మహిమ గల్గి
పుణ్యజీవన విఖ్యాతి బొందివెల్గి
నిండు జవరాలి పోలిక నుండు నట్టి,
ఆంధ్ర భారతి కతి భక్తి నంజలింతు.

''అందరు నన్ను జూచి పరిహాసము లాడుదు రెందు కమ్మ ? నే
నందముగా గనంబడనె'' యన్న నుమాసతి నీవె ముద్దుగా
నుందువు చిట్టితండ్రి యని యూరక నక్కుననొత్త లీలమై
చందురు వెక్కిరించెడి గజానను గొల్తు నభీష్ట సిద్ధికై.

''తలకొని పూర్వజన్మ సుకృతంబున బో నవనీత కల్పనా
కలిత మృదూక్తులం బలుక గంటివి నీ వని''మెచ్చి లక్షణం
బుల దెలియంగ జేసిన ప్రబపూర్ణ కళాన్వితులట్టి నాదు యొ
జ్జల నెద బ్రస్తుతింపుచు నొసంగెద నిర్మల భక్తి నంజలుల్.

ఆవని బ్రసన్నభావ లతికాంకురముల్ మొలిపించి పెంచి సా
సవ ఫల మాధురిన్ తెలుగు సంతతి కెల్లను బంచి కోర్కెలన్
దవులగ జేయజాలు కవితా వనపోషకులైన సర్వస
త్కవులకు నంజలింతు రసగౌరవమున్ వెలయించు నేర్పునన్.

# ఒక మాట

చేతునో ! లేదొ! మధురస సృష్టి నేను
మొలచునో! లేదొ! భావకౌముదులు మొదలు
పూయునో! లేదొ! నా తపఃపుణ్య లతలు
ఎటు లయిన నేమి? వ్యవసాయమే నొనర్తు.

తొలికారింతకు మించిపోయినది, నాతోబాటు క్రొంగ్రొత్తగా
హలముల్బూనిన వారి చేలపయి లీలాళిప్రపంచంబు, మం
జుల నాదం బొలయించుచున్నది రసౌత్సుక్యంబునన్ నేను కో
యిలలన్ బిల్చిన జాలు పెద్దఫల మాశింపంగ బో నెప్పుడున్.

నాది స్వతంత్ర వృత్తి యయిన న్విడనాడను ప్రాజ్ఞనస్సుమా
మోదము లివ్వి నిత్య నవ మోహనముల్ గద తెల్ప రాని యా
వేదన లెల్ల నా కృషికి విత్తనముల్ సుమి, ఇన పూర్వపుం
బాదుల నాటితిం జెదలు బట్టని వౌట దలంచి యెప్పుడున్.

క్రొత్తదనాలనే కొసరు కొందురు కొందరు, కొందఱుం బురా
వృత్తము లందు మోహమును వీడరు రెంటి సమన్వయించి నీ
రెత్తెద తెన్గుతోట చివురింపగ నేటి రసజ్ఞలోక మీ
మెత్తని పైరులోని రుచి మెచ్చిన మోడ్తు కృతజ్ఞతాంజలుల్.

---

# ఓ కవీ!

విశ్వమానవ కల్యాణ వీథులందు
సాహితీ తోరణాలు పచ్చగ నమర్చి
సంఘసేవానిరతి ముందు సాగుమోయి,
వచ్చినది నేడు విజయ సంవత్సరాది.

పరమ స్వేచ్ఛానురాగోప వనములెల్ల,
పల్లవించెను నవ చైత్ర ఖావరుచుల
కోకిలారావ మధురిమ కొసరి కొసరి
మెదవి పాడుము మానవాభ్యుదయ గీతి.

భావి జీవ(జగత్క్రథా భాగమందు
గలుగు సుఖదుఃఖ నివహ సంఘటన లెట్టి
మార్పు తీర్పుల వన్నియల్ గూర్పగలవొ
ఓకవీ నీ కలము ౹తుప్పు గీకవోయి !

తరళమౌ నీ వయోముక్త సరములోని
తరుణముత్య మింకొక్కటి తరగి పోయె
వేచి యుంటివా ముత్యాల విలువ జెడును
సహజ దీప్తిని లోకాన చాటు మోయి !

సత్య సంకల్ప దీక్షానుసార మధుర
సారస రసోక్తి, శౌర్యరస ప్రసార
మాంధ్ర జీర్ణ జీవాణువు లందు నెఱపి
నిలుపు మోయి!మహాంధ్రవాణీప్రశస్తి !

# పూజ

అది యొక రమ్య రమ్య కుసుమావృతమౌ వన మవ్వనంబు ష
ట్పద శుక కోకిలా రవ శుభస్వర లోల పరిమళానిలా
స్పదమయి స్వచ్ఛమై ప్రకృతిచక్కదనాల విశాల భావ సం
పద పులకించు, ప్రాగ్రుచిర భాస్కర సత్కిరణప్రదీప్తమై.

అట్టి అందాల పూదోట యందు గలదు
విమల సౌరభ సుమలతా విరచి తోప
మందిరంబది యత్యంత సుందరంబు
అందు గల దొక వికచ పద్మాసనంబు.

ఆ మనోహరోద్యానము నంటి పారు
నొక వియన్నదీవేణి నేత్రోత్సవముగ
నందలి జలంబు లమృత మరంద రుచుల
జిలికి తగియుండు దేవాభిషేకములకు.

ఆ లలిత ప్రశాంత వనమందున నే నుషయంపు వేళలన్
పూలు దళంబు లేరుకొని బుట్టల యందున నింపి కొన్నిటిన్
మాలలుగా రచించి సుమమండప శుద్ధి యొనర్చి పుప్పొడుల్
రాల్చి ముగ్గులల్లి మకరందము గంధము సేకరించియున్.

అచట గల్గిన మిన్నేటి యసలు బిసికి
చేసిన ఘటంబు లన్నియు చెంత నున్న
నిర్మల నదీ జలంబుల నింపి వేసి
పరుగు లెత్తితి ప్రాగ్దిశా ప్రాంగణముల.

హాయి నొసంగు మంద మలయానిల వీచికలందు సంజకెం
జాయ వెలుంగు లందున బ్రసన్నత గన్న మనఃప్రవృత్తితో
కోయిల పాటలం దలముకొన్న సుఖస్వరమెత్తి వేగ రా
వోయి! ప్రభో! యటంచు మధురోజ్జ్వల గీతము నాలపించితిన్.

ఆ శుభగీతికారవ మనంత విశాల వినీల నిర్మలా
కాశము దాటి సత్త్వ పరికల్పిత సర్వ జగద్విలాసలీ
లాశయ దీపితంబయి సుఖావహమై జలజాసనాది యో
గీశుల కైన నిక్కముగ నెన్నగరాని పథంబు నంటినన్.

పూర్ణేందు బింబమ్ము బోలిన నెమ్మోము,
దరహాస చంద్రికల్ బరపు చుండ
సుందర నయనారవిందముల్ చిక్కని
కరుణాసవంబును గురియు చుండ
నీలారుణాంబుద శ్రీ లలితాంగముల్
శృంగార వృష్టి వర్షింపు చుండ
భానుసహస్ర విభ్రాజిత మణికిరీ
టము విశ్వమును ప్రకాశ మొనరింప

కలిత పీతాంబరంబు చక్కని తురాయి
చిఱుత గాలికి నాట్యంబు గఱపుచుండ
చల్ల చల్లగ పుడమికి జారి వచ్చె
దివ్య మంగళమూర్తి నా దేవు డపుడు.

తనువు పులకించె నిర్మలత్వము వహించె
కనుల నానంద బాష్పాలు క్రమ్ముకొనుచు
భక్తి యనురక్తి యుప్పొంగి పారె హృదయ
కమల మమలాశయ తరంగితముగ దోచె

గిదగిద పర్వులెత్తి సురకిన్నెరయతుల కందరాని శ్రీ
పదముల వ్రాలితి న్నవనవ ప్రమదాశ్రుజల ప్రవాహముల్
కదలి తదీయ దివ్య పదకంజయుగార్చన జేసె మున్ను నా
నుదు రది యేమి నోచుకొనెనో మహనీయ సుఖానుభూతికై.



2)

తనిసి జగమెల్ల మఱచి నా తనువు మఱచి
యెంత సేపట్టు లుంటినో యెరుగ లేము
అమర జీవామృతం బగు నతని కరము
శిరము నంటగ నే పునస్మృతిని గంటి.

భావము పల్లవింప కర పద్మముల న్నను లేవనెత్తె దీ
నావను డంత నేను తడియారని కన్నులు విప్పి విప్పి నా
నావిధ చిత్కళా విలసనంబుల ముద్దుల మోము గాంచితిన్
శ్రీవిభు డొక్క లేనగవుచే మఱపించె సమస్త తాపముల్.

రమణి కోయిల మంగళారతులు బాడె
బాల షట్పది కిన్నర స్వరము లొలికె,
ప్రకృతి కుసుమాక్షతలు చల్లి పలుకరించె
దేవదేవుని భావనా భావనముల

అవిరళ సుఖాస్పదంబులై యఖిల భక్త
రక్షము లైన శ్రీపాద రక్ష లొలిచి
హృదయమున కద్దుకొని కండ్ల కదుముకొనియు
శిరముపై జేర్చి ముందర నరుగుచుంటి.

కమ్మని తావులన్ మృదుల కాంతుల నీనెడి పూలగన్న, లే
గొమ్మల వంచివంచి సుమకోటిని రాల్చి రమాధినాథు పా
దమ్ములు గందకుండ వనదారు లమర్చితి మందమంద యా
నమ్ముల వచ్చె నా కమలనాథుడు పుష్పల తాలయంబుకున్

ఆ లతాలయ ప్రాంగణ మందు పూల
తిన్నె నమరించి దానిపై వెన్ను నునిచి
శ్రీపదాంబుజ యుగ ళోపసేవ లమిత
భక్తి సలిపితి నలసట బాయునటుల.

పిదప నే బంగారు బిందెల యందు
నింపిన స్వచ్ఛమౌ నీటిచే ప్రభుని
శ్రీకర పాదాభిషేకంబు చేయ
పాదతీర్థము సరస్వతి యయ్యె పారె.

ఆ పుణ్య తోయము లందు మునింగి
తొలగించుకొంటి నా కలుషంబు లెల్ల,
స్వచ్ఛమై శుచియై ప్రశాంత చిత్తమున
పరమ పవిత్రమై బరగితి నేను.

అపుడు నా యీశ్వరుని కుసుమాలయంబు
నందు గల నవ్య పుల్లాంబు జాసనమున
ప్రేమ మీరగ గూర్చుండ బెట్టి మేన
లలిత కర్పూర చందనాదుల నలంది.

కోమల పల్లవంబులను గూర్చి రచించిన నవ్య మల్లికా
దామము లీప్సితార్థ ఫలదాయి గళంబున వైచి పూర్ణ ని
ష్కామ విభూతి పాద జలజంబులపై తులసీదళాలు నా
నా మృదు సూనముల్ మధు కణంబులు నుంచి నమస్కరించితిన్.

విమల హృదయాన నొక జ్యోతి వెలుగ జేసి,
మంగళారతి నొసగి సాష్టాంగ మతని
యడుగు దమ్ముల బడితి నన్నుడుగకయె, త
దంకితంబయి పోయె నా యాత్మకూడ

(హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వముచే
నిర్వహింపబడిన కవితారచన పోటీలో
రెండవ బహుమతి నందినది. ఎప్రిల్ 1953.)

# శుభోదయము

నా కవితా శుభోదయము నాటికి మా తెనుగిండ్లు మౌగ్ధ్యశీ
లాకర బాలికా కరకళాశ్రిత మోహన రంగవల్లికా
శ్రీ కలితంబులై సుమపరీమళి తారుణ తోరణాల, శో
భాకృతి స్వాగతం బిడు జయావహ నవ్య వసంత లక్ష్మికిన్.

నా కవితా శుభోదయము నాటికి క్రొత్త తెనుంగురాజ్య ల
క్ష్మీకర పద్మసౌరభ సమీర మనంత మనోజ్ఞమై బుధా
ళీ కలరావ రమ్య రవళిన్ హవళించి స్వతంత్ర భావనా
లోక విలోలమై మొగులులో గలియు న్నవసాంద్ర రాగమై.

నా కవితా శుభోదయము నాటికి తెన్గు ప్రబంధ మర్ధవి
ద్యా కమనీయ నీతము, మహా జనతా రచితానుబంధ లీ
లాకృతము న్నవోజ్వల రసాత్మక మాత్మయశస్సరిత్కథా
నీకము శర్మదం బయి మనీషి మనోజ్ఞములన్ ధ్వనించెడిన్

(భారతీసౌజన్యంతో)

## ఆంధ్రావతరణము

దివ్య దీక్షాంతరస్ఫురద్దీప్తి నమర
జీవి యైనట్టి యొక త్యాగశీలు నాత్మ
ఆంధ్ర సామ్రాజ్య లక్ష్మి యై యవతరించె
రండు, రండోయి! మంగళారతులు బాడ.

కనుపించె శాతవాహనుల ఆంధ్రత్వంబు
దూర తీరాల విందా రగించు
చేయెత్తినది కాకతీయ రుద్ర యశస్సు
తన తెన్గు జయపతాకను ధరించు
వేంచేసినది కొండపీటి రాజసము స
మంచిత ప్రాగ్విజయమ్ము దెలుప
కనుపించె నీనాడు విద్యాపురీ కళా
విభవ ప్రభూత దుందుభుల మ్రోత

అదిగొ కాపయ పాపయల్ జదువుకొన్న
తెనుగుబళ్ల నీ నాటికి తెఱచినారు
అదిగొ రుద్రమ్మ యేగిన అమరపురికి
మ్రొక్కుచున్నారు చేతులు మోడ్చి నేడు.

గోదావరి యనుంగు కూతుళ్లతో గూడి
తెలుగు వాకిళ్ల ముగ్గులు రచించె
కృష్ణవేణి తెనుంగు కీర్తి కుప్పలు వోసి
ఇంటింట నొక దీప మెత్తు చుండె
తుంగభద్ర జలాంతరంగ తరంగాల
తెనుగు సస్యశ్రీల బిలువ నరిగె
పెన్నానది తెనుంగు కన్నెయై విలసిల్లి
జిలిబిలి పన్నీరు జిలికి వెలిసె.

ధరణికోట శ్రీపర్వత ద్వారములకు
నోరుగలు గట్టె పచ్చని తోరణంబు
వాడిపోయిన ఉద్యానవనము నేడు
పల్లవించె కోయిల లేమొ పాడు నదిగొ!

ఈ శుభోదయ కోలాహ లాశయముల
నలులు, శిలలు కలాల్ పోలా లూళ్లు నేళ్లు
నలరి కానుక లర్పింపె నాంధ్రి కదిగొ
ఇన్ని నాళ్ల తపస్సు ఫలించె నేమొ!

నేను తిక్కన్ననై నిల్చిపోవుదు నంచు
కల మెత్తి యొక్కడు పలుకు నదిగొ
నేను త్యాగయ్య నైనానని కమ్మగా
గొంతెత్తి యొక్కడు గొణుగు నదిగొ
నేను వేస్తంభాల నీడ నిల్పుదు నంచు
యులి యెత్తి యొక్కడు నిలిచె నదిగొ
నేను యుగంధర జ్ఞానె యని పిచ్చి
యెత్తి యొక్కడు ఢిల్లి కేగు నదిగొ

బాల చంద్రుల మని బొంగరాల నాడు
పిల్ల పిండుల యార్భాట మెల్ల గనగ
నెవ్వడే మగునొ చెప్ప పెట్టునేడు
కలిగినది చాలు ఒవ్యసంచలన మొండు.

ఎవ్వ డననేల? నా తెనుగవ్వ పాత
కతల నెరిగిన నేను నిక్కపు తెనుంగు
వీరుడను సంకుచిత బుద్ధి వీడి నిల్తు
మూడు కోట్ల ఒత్నాలొక మూట గట్టి.

నా తెన్గుగుండె యీనాడు నిబ్బర మొంది
ఎదిరించు నన్యాయ మెల్ల యెడల,
నా తెన్గుశీర్ష మీనాడు వంగక నిల్చి
ప్రకటించు దీక్షాస్వభావ మొకట

నా తెన్గునెత్తు రినాఁడు వెచ్చగ బారి
యుడిగించు దౌర్జన్య మొక్క చోట
నా తెన్గువాణి యీనాడు నిగ్గులు దేరి
వెలయించు శాశ్వత విశ్వశాంతి

తరతరాలుగ దీపించి మరుగు వడిన
విమల తేజము దిగ్దిగంతముల దాక,
వెలుగు నట్టుల నన్నియు వెదకి వెదకి,
పాడుదును తెన్గుపాటయే నేడు నేను.

# అంతర్వాణి

కవివై నిల్వగ నెంతువా! విడువు సౌఖ్యం బెల్ల మోహంబులన్
దవులంబోని నయానుషంగివయి! స్వార్థత్యాగివై సత్యమున్
బ్రవచింపం దగు. పాపపల్లవిత దుర్వ్యాపారముల్ బాప మృ
త్యువుకేనిన్ భయమంద కుండుటయె యుద్యోగంబు నీ కెప్పుడున్

రాజకీయాలు నిన్ను చిరాకు జేయు
సంఘ మొకవైపు కోరలు సాచివచ్చు
లోక మొకరీతి నిన్ను కల్లోలపరచు
భయపడక నిల్వు మిన్నులు బడ్డగాని.

ఋషివై మానవ మానసాంతర సుహృద్వృత్తంబులం దెల్పుశే
ముషి నార్జించి జయింపు దుఃఖము, తమంబున్ ఘోర నైరాశ్య మే
విషయంబైన జగద్ధితాశయము నన్వేషించి స్వచ్ఛంద వై
దుషిచే సుందర కల్పనారుచుల నందున్ గూర్పు ప్రజ్ఞానిధిన్.

చీమలో సంపూర్ణ జీవ వికాసంబు
బ్రహ్మదేవుని యందు వ్రాత దొసగు
పరమాణువం దుద్భవంబౌ మహాశక్తి
శైల నానువులోని జాలి గుండె
పసిపాప నవ్వులో పరమార్థ భావంబు
ముదుసలి పెదవిపై మొలచు తృష్ణ
చల్లనినీట ప్రజ్వలితమౌ యనలంబు
నగ్నియం దణగు సంయమన బుద్ధి

చేదుగా దోచు యౌషధసేవ, యమృత
సారమున సత్యమై యుండు చావు, తమసు
గర్భమున శాంతి, చీకటి కాంతిక్రింద
వెదకి చాటుము జంకుగొం కొదవ కుండ.

నీ వొక పావురా యగుచు నింగికడల్ తరియించి యేగి రా
జీవ భవాండముల్ వెలయ జేసెడి వానిని జూచి పల్కు, మే
జీవికి నైన దుఃఖమును, చేదు మనస్సు నొసంగ కుండ నా
తావుల నున్న సచ్ఛిదుపధానములన్ గొనిరమ్ము భూమికిన్.

పేవుండైన ననర్థ కల్పనల నుద్దేశించి దౌర్భాగ్యముల్
బ్రోవుల్ వోయగ జూచెనా! వ్యధిత జీవుల్ తృప్తి నొంద న్మహా
రావం బెత్తియు దిట్టు మాతడు దయార్ద్రస్వాంతు డౌనట్లుగన్
నీవే సుందర నిత్య ముజ్జ్వల జగన్నిర్మాణ కార్యంబునన్.

కవియె రవిచంద్రుడున్ సృష్టి కర్తయతడు
శాశ్వతుం డమరుండు, విశ్వాత్మకుండు
పలుక జాలుమవే నీవు గళము నెత్తి
"కవిగ నే నిల్తు" నంచు లోకమ్ము నంచు

# వోటు - అభ్యర్థి

వోటు వోటని యెలుగెత్తి చాటు దీవు,
యెవరి కీవోటు? నీ కొరకేన? నీవు
నిర్మల త్యాగమూర్తివై నిలచినావ?
తెలుపు మభ్యర్థి పదవినే వలచినావ?

కడుపు మంటలలోన పెల్లుడికి యుడికి
చలికి వేడికి కన్నీళ్లు చిలికి చిలికి
కలగు మానవ హృదయాలు గాంచినావ?
తెలుపు మభ్యర్థి పదవినే వలచినావ?

ఎముకలును ప్రేవు లన్నియు నెండిపోయి
చదువుసందెలు లేని మా చంటిపులుల
జాలిగుండెలతో గన జాలినావ!
తెలుపు మభ్యర్థి పదవినే వలచినావ?

దేశ సేవావకాశ మేతీరు నైన
గలుగ జేయు మటంచును పలుకుదీవు
దేశమన నేమియో! ముందు తెలిసినావ?
తెలుపు మభ్యర్థి పదవినే వలచినావ?

బక్క రైతుల నెత్తుటి చుక్క లన్ని
గలిపి మేడలు మిద్దెలు గట్టినట్టి
నాటి రాక్షస స్వార్థ మీనాటికైన
వదలినావా? దురాశనే వలచినావ?

కల్లబొల్లి ప్రసంగాల నెల్ల నమ్మి
మోస పొందిరి మా దేశవాసులెల్ల
సత్య దీక్షార్థివై ముందు సాగినావ,
తెలుపు మభ్యర్థి పదవినే వలచినావ?

# ఉపాధ్యాయుడు

## నాడు - నేడు

విమల విజ్ఞాన జలధి పవిత్రమూర్తి
సరళ జీవి ఉపాధ్యాయవరుడు నాడు
కపట విద్యానటుడు, డాంబిక ప్రవృత్తి
వలచి నిలచెడి వ్యామోహ వశుడు నేడు.

లోక కల్యాణమే మదిలోన నెంచు
పరమ సేవాశ్రమ విలాసి గురువు నాడు
బ్రతుకు దెరువునకై పాటు పడెడి చదువు
పంతులను పేరు గల స్వార్థపరుడు నేడు.

నాడు సంపూర్ణ స్వేచ్ఛాగుణ ప్రభావ
జీవ సంస్కారి, ఆచార్యదేవు డతడు,
నేడు హాస్యానుబంధ విమూఢు లైన
కొలువు దొరలను మెప్పించు కూలివాడు.

సకల రాజన్య మస్తక మకుట మణుల
త్రుప్పు విదలించె గురు పాదధూళి నాడు
మణపు గని ఉధ్యాయుల మస్తకములె
ధన మదాంధుల మ్రోల వంగినవి నేడు.

జాతికిని, దేశమున కెల్ల శాంతి సౌఖ్య
ములను సమకూర్చు నట్టి నిర్మల హితంబు
నాచరించు టొక్కటియె అధ్యాపకునకు
వీడగారాని దర్మ మానాడు -నేడు.

# అస్పృశ్యతానివారణము

విశ్వమానవ సౌహార్ద వీధు లెల్ల
మురిగి పోయె నస్పృశ్యతా కరములయ్యొ
తమ్ముడా! రమ్ము క్రొత్త సాధనము లూని
యెత్తి వేయుద మీ కంపులెల్ల నేడు.

ఏనాడో మనలోని స్వార్థము లె కల్పించెన్ గదా ఈ మహా
దానంబైన విపత్పరిస్థితులు భద్రంబింక లే దవ్వియే
యీనాడుం దలపెట్టుకున్న కను మన్నా! ఒక్క చే యింటిలో
నానా జాతుల రోగముల్ గలిగి ఛిన్నాభిన్నమైనామిదే!

అన్నా! పెత్తన మెంచి సోదరుల కన్యాయంబె యోచింతువా
యెన్నాళ్లీ యధికార మెందుకః దబాయింపుల్ బుకాయింపు లీ
పన్నాగంబుల వల్ల సంఘ మిటులన్ బాడయ్యె నేడైన, నీ
కన్నుల్ విప్పుము భారతావనికి స్వర్గశ్రీలు ప్రాప్తించెడిన్.

అంటగరా దటంచు పురమంచుల నుంచెద వేల? నీవు వె
న్నంటి జనించియున్ వెతల నందెడి వాడను జుండుగాద నీ
కంటకవృత్తి కింత కనికారములేద? యతండె నీదు పె
ద్దింటికి గోడవెట్టు శయనింతువు ఆతడమర్చు శయ్యపై.

హృదయములు, జీవములు లేక కదల లేని
బండలను అంటుకొన్న పాపంబు రాదు
ప్రాణ ముండియు నీ కన్నివను లొనర్చు
మానవుని ముట్టగా దోషమా నిదేమొ!

ఇంగిత జ్ఞాన మింతయు నెరుగ నట్టి
పశువులను దోలుకొందువు వంట యింట
పిల్లులను కుక్కలను చంకబెట్టుకొందు
వకట మనిసియే యంటరాదయ్య నీకు.

అందర మొక్క ఈశ్వరుని యందు జనించిన వారమే కదా!
అందర మొక్కరీతి సకలాంగము లింద్రియ కృత్యప్రవృత్తులున్
బొందితిమే కదా! మొదట మొత్తము మానవు లొక్కకచే గదా!
ఎందుకు భేదమో! తెలియ దెక్కడివో తలతిక్క యెక్కువల్

జీవం చింతయు లేని పీన్గువలె నిశ్చేష్టుండవై యాశతో
యావ ద్భాగ్యము మ్రింగ జూచెదవు దయ్యంబట్లు నీ వాతడో
దేవుం డిచ్చిన దివ్యశక్తి నెపుడుద్దీపించి ముల్లోకముల్
బ్రోవన్ నెత్తురు నీరు జేయు కులతప్పాల్ నీక? యవ్వానికా?

సర్వ సమతానుమతమునే చాటి నాడు
బుద్ధ దేవుడు చిత్తసంశుద్ధి దలచి
మొన్న మొన్ననే కద! మహాత్ముండు కూడ
అంద రొక్కటే యని చెప్పి యరిగినాడు.

ఓసీ మానవతా తలంప విది నీవొక్కింత నిన్నెంత రా
కాసిం జేసె ననర్థ కల్పనలు లోకంబెల్ల, నీ మూర్ఖ వి
శ్వాసాలం గని నవ్వుచున్న దమలజ్ఞానార్థి జింతింపు మీ
వేసంబుల్ కొరగావు శాశ్వత సుఖాభీష్టంబు సిద్ధింపగన్.

(హైదరాబాదు ఆల్ ఇండియా రేడియో సౌజన్యంతో)

# మహాత్ముడు

రవికిన్ మాటువడంగ రాని ఘన సామ్రాజ్యంబు లీల న్మహా
ర్ణవముల్ నింగికడల్ తరింప గల విజ్ఞానంబు సైన్యంబులున్
వ్యవహారంబుల దిట్టమైన ప్రతిభా వైదగ్ధ్యముల్ గల్గు భూ
ధవు లాంగ్లేయులు పారిపోయిరొక స్వార్థత్యాగిచే నోడయున్.

నెత్తురు చుక్కయైన బడనీయక పోరెడి దివ్యశక్తి రే
కెత్తగ జేసి దేశములు గెల్చి జయధ్వజ మెత్తినట్టి లో
కోత్తరమౌ యుదాహరణ మొక్కటి నిల్పి జగచ్చరిత్రకున్
క్రొత్త మెఱుంగు లద్దె నొక కోమటి బిడ్డ ప్రపంచ పూజ్యుడై.

అతడొక దివ్యజీవి కరుణాకులమానసు డార్తలోక స
న్నుతచరణుండు నిర్మల మనోజ్ఞ దరస్మిత సజ్జితాననుం
డతడు మహాత్ము డాతడు మహాత్ముడు.........

... ... ...

నవ్వెనా తన బోసినవ్వుల వెన్నెలల్
శ్వేత జాతుల నెల్ల సిగ్గు బఱచె,
పలికెనా? ముత్యాలు జలజలజల రాలి
హైందవజన హృదయాలు దెలిపె

తలచెనా? తన బోడితల నిండ రత్నాలు
బండి దేశపుచిక్కు బాప జేసె,
అలిగెనా ముజ్జగంబులు తలక్రిందులై
ప్రళయాగ్ని లోన డిప్పలుగ రాలె

అతడు తనిసిన లోకము లన్ని దనిసి
నిండు సుఖముల పంటల పండి వెలసె,
గాంధిదేవుడు స్వాతంత్ర్య కల్పతరువు
భారతసరస్వతీ తపఃఫల మతండు.

తన చిన్న కదురు చేతం బూని ఆంగ్లేయ
బొక్కసాలకు పొక్క బొడిచినాడు,
తన నూలుపోగుచే దారిద్ర్యమును బాపి
భారతీయుల చక్క బఱచినాడు.

తనదు సత్యాగ్రహోద్యమ వహ్ని శిఖలచే
బ్రిటిషు తంత్రంబుల బ్రేల్చినాఁడు
తన అహింసా సూత్రమున ప్రపంచము
నెల్ల బంధించి పిడకిట బట్టినాడు.

తనదు శాంతంబునన్ చల్లదనము గూర్చి
మండుటెండను జ్యోత్స్నగా మార్చినాడు
తనపదాంకితమైన భూతలము నందు
నందన వనాలు మొలపించినాఁడతండు.

హరిజన సముద్ధరముల కతఁ డమృతసూతి
మతమహోన్మాద ముడిగించు మహిత మతఁడు
పతిత మానవజాతికి పట్టుగొమ్మ
ప్రేమ మయ శాంతి కతఁడు శ్రీరామరక్ష!

అకటా అతఁడులేఁడులేఁడనెడి దీనాలాపముల్ ముల్లపో
లిక జిత్తంబును గ్రుచ్చుచున్నవి కృపా లీలాంతరంగుం గిరా
తకుఁడై యెవ్వఁడొ కాల్చి వేసెనట, నిర్ఘాతఘాత్యాచిత్తుండు, హం
తకు డాతండును భారతీయుఁడట సంతాపంబు పెంపయ్యెడిన్.

లలితము సుప్రసన్నము కలాస్ఫురితంబు ముఖంబు, ప్రార్థనా
కలిత వినమ్రతాలయము కాయము తీయనితేనియల్ వచ
స్సులు స్వయమేవదైవమగుచు న్వెలుగొందు మహాత్ము చంప న
త్తులువకు జాతిగుండె గల ద్రోహికి నెవ్విధి జేతు లాడెనో?

చావగలేదు ధర్మరథసారథి చావగలేదు శాంతికిన్
జీవనమయ్యి యెవ్వగపు జెందని కాయము దాల్చినాడు

... ....  ...

అతడొక దివ్యజీవి కరుణాకులమానసు డార్తలోక స
న్నుతచరణుండు నిర్మల మనోజ్ఞ దరస్మిత సజ్జితాననుం
డతడు మహాత్ము డాతడు మహాత్ముడు మానవులార నేటికిన్
బ్రతికియ యున్నవా డతని పాదములందె వసించు స్వర్గముల్.

# పద్మిని

మిసమిస లాడు సోయగము మీద సుగంధ మరంద మాధురుల్
గుసగుస వోవ, మార్దవము గొన్న సుమాంగము లంబరాగపుం
బసుపు లలంకరించుకొని భాస్కరు పూజల దేజరిల్లు నీ
ముసిముసి నవ్వులో బ్రణయముల్ పరిపూర్ణము లయ్యె పద్మినీ.

పుట్టి పుట్టక మున్న పట్టు పుట్టంబులు
దాలిచి మేనెల్ల దాచుకొంటి
వల రజస్స్వలవు గానంత కన్నను మున్న
పురుషాళి సంగతి నెఱుగ కుంటి
వరసి నీ వరనిశ్చయంబు సేయక మున్న
కవ్వించు వారి లో నవ్వ కుంటి
వాసవామోద వికాస మూనక మున్న
తరుణీ శిరోధార్య గరిమ గంటి

విట్టి నీగుణ సంపద లెల్ల జూచి
అలరి తరుణ వయస్కుడౌ అర్కరాజు
తన కరంబులు సాచి నీ తనువు నిమిరె
అపుడె పద్మినీ! నీ చిక్కు లన్ని దీరె.

కనులను విప్పినంత నవకంబులు గూర్చుచు మింట తప్త కాంచన విలస న్మయూఖుడు గనంబడె ముగ్ధతనాన నీవు, నయ్యినునె వరించి నీ హృదయ మిచ్చితివే కల రంతకన్న చక్కని పతులన్న నెవ్వరిని గానవు మానవతీ శిరోమణీ!

ఆకాశ సౌధమం దవతరించు నతండు
పుడమి లోతుల లోన పుట్టుదీవు
కాలాగ్ని కీలికల్ గలిగి యుండు నతండు
చల్లని నీట వర్ధిల్లు దీవు
అలసట లేని ప్రయాణీకు డాతండు
ఇల్లు వీడని పూవు టింతి వీవు
నీరసం బెనయించ్చి నెగడు చుండు నతండు
సరసవై యలరెడి జాణ వీవు

ఇట్టి నీకును సూర్యున కేటి జోడు
విడువు మాతని చక్కని విభుడు దొరుకు
అదిగొ పద్మినీ మొగము ద్రిప్పెద విదేల
పడతి ప్రణయాని కొక్కడే భర్తయేమొ.

సురభిళాంగివి నవరస భరిత వనుచు
నీదు తరళానురాగము నిచ్చ గించి
జార నాయకుడైన అబ్జారి యెట్టి
వెతల బడుచుండెనో! గన వేల పద్మ!

తన యశస్సాంద్ర గీతముల నాలాపింప
భ్రమదాళినీ రాయబార మంపె,
తనదు దాంపత్య విధానంబు దెలుపంగ
కోకపక్షుల జంట గూర్చి యునిచె,
తన రతిచాతుర్యమును వర్ణనము సేయ
కలువమ్మ నవ్వులు వెలయ జేసె,
తనయందు గల చల్లదనమును జూపింప,
మలయానిలుని బంపి కలత వరచె,

అళుల బంధించి పక్షుల దొలగజేసి,
కలువరాణినిదిట్టి ముఖంబు మాడ్చి
పవనుపై దుమ్ము బోసి కోపమున నూగి
బుద్ధిసెప్పితి నీవెంత బుణ్య సతవొ!

కలికి, నీపతిలేకుంట గాంచి పగటి
కొఱత లెల్లను సవరించుకొనుచు శశియె
స్వయముగా వచ్చి బ్రతిమాలసాగె నదిగొ
ముట్టకు మటంచు మేనెల్ల ముడుచు కొనెదె!

సరసా! చల్లనివాడు షోడశకళా సంపూర్ణుడున్ స్నిగ్ధ సుం
దరు డాచుక్కలరేడు తాపమున పద్మాయంచు నిన్వేడ నా
దర భావంబున జూడ వేమి? దయ రాదా? నీకు, సచ్ఛీల ల
న్యరతిన్ గోర రటంచు నూగెదవహో నైర్మల్యపుం భావనల్.

ఉదయ మౌటకు మున్న సదమ లాంగంబులన్
ముకుళించి హృదయేశు మ్రొక్కుచుందు
వపుడు నీరము లాడి హసితాబ్జముఖి వయ్యి
పతికరాల రసాలు బంచు చుందు
వలరి నీవిభుడు దివ్యారు ణాంబరముల
ధరియింపగా జూచి మురియు చుందు
వతడు బోయెడి త్రోవ లట్టె జూచుచు నుండి
భావ మాతని వెంట బంపు చుందు

వతడు కనబడ కుండగా నరిగి నంత
ముఖము వాలిచి తలకొంగు ముసుగు వెట్టి
అందములు వీడి కలవర మందు చుందు
వెంద రున్నారు నీవంటి యింతు లవని?

ఎన్ని నాళ్లు తపించెనో యినుడు నిఖిల
కలుషరహితను నిన్ పత్నిగా గనంగ
అవని భవ్యాత్మలైన కులాంగనలను
బడయు మగవారి భాగ్యమే భాగ్య మబ్జ!

బంగారు రంగులు బరచి యా చేమంతి
తల వంచి లక్ష్మికి నెలవు సూపె
ఇంపు లిగిర్పగా సంపెంగ సుందరి
వాసన ల్నింపి నివాళి నిచ్చె
స్నిగ్ధ లావణ్యరాశి గులాబి రాణి, రె
క్కలు విచ్చి ప్రీతి స్వాగత మొసంగె
కుముదినీ సతి ముద్దుగుల్కు నవ్వులు నవ్వి
యెరుపు కాంతులతోడ నెదురు కొనియె

నెందరో సుమకోమలు లిందిరమ్మ
పొత్తుగోరిరి గాని ఆ పూజ్యురాలు
అందరిని ద్రోసివేసి నీయందు జేరె
పడతి ధర్మమే లక్ష్మికి పట్టు రమణి!

# స్వాగతము

''పులకరించెను జనగామ భూము లందు
నవ్య సారస్వత సరోవనాలు నేడు,
మూగ తమ్ములు నోర్విప్పి స్వాగతంబు
బలుకు చున్నవి విజ్ఞాన భాస్కరులకు.

ఇంతని చెప్పలేక 'హృదయేశ్వరి' దెచ్చిన కీర్తి చేత ది
గ్దంతుల వంచి నవ్య కవితా యుగమున్ సృజియించి భావ సి
ద్ధాంతములన్ రచించిన విధాతయె శ్రీశివశంకరార్యు లీ
చెంతకు ప్రేమ మీర దయచేసి రిదెంతటి పుణ్య కాలమో!

వేదకళా ప్రపూర్ణులు పవిత్ర చరిత్రులు కాంచనోత్సవా
పాదిత సద్యశస్తరళ వైభవు లుత్తమ కావ్యశిల్ప సి
ద్ధోదయ భాస్కరుల్ మణిమయోపకిరీటధరుల్ ప్రసిద్ధ శ్రీ
పాద కవీశ్వరుల్ గురు కృపారతులై యరుదెంచు టల్పమే?

పొదిసి యనేక భాషలను పుక్కిట బెట్టి మృదూక్తి లోకముల్
గడిపి రసార్ద్ర భావ నవకంబుల నాట్య మొనర్చి గానష
ట్పదులయి, 'అగ్నివీణకు' శుభస్వరముల్ గలిపించి నట్టి కో
విదులట 'పుట్టపర్తి' సుకవి ప్రవరుల్ జనుదెంచి రద్దిగో!

అభినవ తిక్కయజ్వ బిరుదాంకితులై కమనీయ సాహితీ
విభవము గాంచి మా తెనుగు వీధులలో కవితాలతాంత సౌ
రభముల నమ్మువారు సుమి, ప్రాజ్ఞులు 'అన్మల శాస్త్రిగా రదే'
ఉభయ కళాప్రవీణు లన నొప్పిన వారి గనం బ్రమోదమౌ.

సంస్కృతాంధ్రములను బరస్పరము ముడిచి
భావ పరివర్తనమునందు బదిలపరచి
వినుతి గన్న దివాకర్ల వేంకటావ
ధాని నన్నయ కవితా రథాంగ మదిగొ!

శ్రీయుతులు గార్లపాటి విశిష్ట యశులు
ప్రౌఢకవులు విమర్శకుల్ పండితులును
రసికజన వంద్యు లగు వీరి రాక వలన
కలిగె నేడు సౌభాగ్యంపు గరిమ మాకు!

ఆర్ష శాఖాధ్యక్షు లాంధ్రాభిమాని
ఆంధ్ర సంస్కృతికి దివ్యామృత ధార
చక్కని విజ్ఞాన జలధి యేతెంచె
శ్రీనివాసాచార్య మాణిక్య మదిగొ!

ప్రణయ జీవిని దలచి శ్రమిక జీవిని బిలచి
భావాల రాగాల బంచి యిచ్చెడి వారు
ఒక వంక వలపుచే నొకవంక కలతచే
హృదయాల నుబికించి కదలించు యువకవులు.

పలుకు పలుకున తేనియ లొలుకు నట్టి
పూలపాటల జగతి నుయ్యాల లూపి,
తెనుగు గేయాల సొగసులు దీర్చినట్టి
ప్రేమ మయులు నారాయణరెడ్డి వీరె.

చారుకలావిలోల విలసన్నవజీవనులార! ఆంధ్ర భా
షా రమణీ మనోజ్ఞ మధుసారములన్ వెదజల్లు భావసం
స్కారకులార! అందరకు స్వాగత మంచు వచించె నవ్యశో
భారతి సాహితీసతి సభా విభవ ప్రతిధ్వనించగన్.

(జనగామ ఆంధ్ర సారస్వతోత్సవాల సందర్భములో)

# తులాభారము

ఓ యకళంకమూర్తి పురుషోత్తమ సర్వ మజాండభాండముల్
నీయుదరంబులో నొదిగి నిల్వగ యీధనరాశ యె తృణ
ప్రాయము అంతఎత్తు సమభారముతో నిను తూచజాలునే
చెయగరాని బేరములు చేసె నమాయకురాలు డెవరా!

వలచుట నేర్చు ఇచ్చగని వచ్చిన నిన్వలపింప నేర్చు, బే
రలుక వహించెనేని శిరమంటగ కాల్గదలింపనేర్చు ని
స్తులమగు నీ మహామహిమ నుంతయెరుంగదు సత్య మోహనో
జ్జ్వల రసికావతంసమవు సైపవటే ప్రణయాపరాధముల్.

అందరిలోన నెంత పరిహాసము పాలయిపోయి తంచు లో
గుందుచునున్న దీకుసుమకోమలి నీ కిసుమంత జాలి లే
దెందుకు స్వామి? యీనగవు లేమి విమోహిత కామినీ గుణా
సందరసప్లుతంబయిన నాటక మింతకు జాలదా? ప్రభూ!

బాలుడవయ్యు యొక్క వటపత్రముపై ప్రళయాబ్ధి డోలలన్
దేలెడి నీ యపూర్వ మగు తేలిక, లక్ష్మి యెరుంగు నెంతకున్
జాలుదు పీవు ఆట లిక జాలును నీతను వందు అంబుద
శ్రీలు ద్రవించి జారినవి చెమ్మటలై శ్రమ యేటి కింతయున్.

ఫలమో! పుష్పమో! తోయమో! దళమో! నీ పాదంబులర్చించి ని
ర్మల భక్తిన్ తులనుంతు నద్దియ వరార్థం బంగనల్ నోచు నో
ములకుం బెద్దదియేని సర్వసుకృతామోదంబు సంధిల్లగా
నలఘుత్వంబు వహించి మాధవుని నిన్నార్జించు కల్పాంశమై.

అనుచు రుక్మిణి తనశిర మందు వెల్గు
పారిజాతప్రసూన సంపదల నొరయు,
దివ్య తులసీదళం బొండు దీసి యునుప
గాలి బుగ్గయై దేలె గోపాల మూర్తి.

# అన్వేషణ

ఎవ్వఁడాతఁడు లతిక నిన్నింత మృదుల
జీవనిగ సృష్టిజేసి పోషించువాఁడు
చెప్పవే పువ్వ! మధువులు జిలుకు నట్టి
మసృణ లావణ్య పరిమళా లొసగె నెవఁడు?

'కూ' యని సర్వదిఙ్మధుర కూజితముల్ వెలయించుచుందు వో
కోయిలరాయ, నీ వగరు గొంతుకలో నమృతంబు పిండె నే
గాయకు డోమదాళిని సుఖ స్వరముల్ తరళించు ఁ బేయుపా
ధ్యాయుని వల్లకీ ప్రణయతంత్రులు నేర్పెను నీకు నింపుగన్.

రాచిలుకా ఒసీ పలుకరాదటె నీ రమణీయ రూపమున్
దాచి భ్రమింప జేసెడి స్వతంత్ర కళారస సిద్ధు డెవ్వడా
లోచన లేల? స్నేహ పరిలోల కురంగినులార మీ లస
ల్లోచనముల్ సుధాకళికలో యన జేసె నెవండు మోహియై.

ఓ సెలయేర! ఈ హిమ రసోల్లసితాంగ మృదంగనాద మ
భ్యాసమొనర్చి తెవ్వని దయాధ్వనిలో మలయానిలంబ ఆ
యాస మదేల? పల్కు మెవడాతడు నీ గమనంబున న్మహో
ల్లాస సుగంధ శీకరముల న్వడబొసె సుఖానురక్తుడై.

ఆకాశంబ! వచింపు మీలలిత నీలాకార మెవ్వానిదో
రాకాజ్యోత్స్న! యెవండు నీ రుచిర సామ్రాజ్యంబునన్ సత్యశ
శ్రీకారుణ్య సుధాంబువుల్ జిలికెనో జీమూతమా? తెల్పు మే
లోక త్రాణ పరాయణుం డిడియె నీలో సస్య సంజీవముల్.

తారకలార! యెవ్వని కథా కలితాతుర రమ్య పంక్తిగా
జేరి యనంత పత్ర ముపసేవ్య మొనర్తురు తెల్పు మమ్మ సం
ధ్యా రమణీ జగద్ధిత కరారుణ హారతులిత్తు వే కళా
కారుని సృష్టికై కమల కైరవ గౌరవముల్ వెలుంగగన్.

అనుచు ప్రశ్నించి యలసిన యట్టి వాని
మధుర భావనాజగమెల్ల గదలు నటుల
ఫక్కు మస్న నవ్వి కనువిప్పె ప్రకృతికాంత
కనులలో సృష్టి కర్తను కనియె నతడు.

# పిచ్చివాడు

తలయున్ గడ్డము మాసి పేండ్లు వడె వస్త్రా లెల్ల ప్రాజిడ్డు ప్రే
వులుగా మారియసహ్యమౌ చెమట కంపుల్ నిండె మేనెల్ల యీ
మలినం బెట్లుభరింతువో తలప వేమాత్రంబు రోయింపులన్
వలదా భౌతిక చింత? మర్త్యుడవు కావా?నీవు నిర్మోహివా?

నిను నీవేసము నీప్రవర్తనము నీనిర్మానుష ప్రక్రియా
భినయంబుల్ గనుచు న్వినోదమున నిన్'పిచ్చోడుపిచ్చోడురా'
యని లోకం బిటు గేలిసల్పినను నీ కానంచమ్మేనా? మరే
మనవేమోయి క్షమించి నవ్వుటయె యూహాతీతమౌ పిచ్చియా?

పిచ్చి వాడని అల్లరి పిల్ల లెల్ల
ముసురుకొని రాళ్లు అప్పలు విసరుచుండ,
ఎంత నొచ్చిన యల్గ వదేల నీవు?
కనికరము లేని వారు ఈ గడుసువారు.

# గీతాస్తుతి

సర్వ శాస్త్రాగమోపనిష ద్విశిష్ట
సూత్రముల వెల్గు గీతా ప్రసూన మాల
లలిత ధర్మపరీమ ళానిలము లొలసి,
యుగ యుగాలలో సుఖశాంతు లొనరఁ జేయు.

వేదవ్యాస విలాస మయ్యు త్రిజగ ద్విఖ్యాతమై సూతగీ
తా ధారా పరిపక్వ పుణ్యఫల యుక్తంబై మహాచార్య భా
ష్యాదర్శ ప్రకట ద్విజాళ్ళపన జన్య ప్రాజ్ఞు రుజ్జీవమై,
ఖేదంబుల్ సమయించి మించు భగవద్గీ తావనీజం బిలన్.

ప్రకృతి కీశ్వరు తోడి సంబంధ మెటులొ
అటులె జగదుపకృతికి గీతానుబంధ
మనుచు యోగులు ప్రవచింతు రట్టి దాని
గనగ జింతించు వారు సజ్జనులు గారె!

తా నొనరించు కర్మఫలితంబును గోరక సర్వ మీశ్వరా
ధీనమ టుంచు నిర్మలమతిన్ దనధర్మము నిర్వహించు వి
జ్ఞాని నిరంతరంబు సుఖశాంతులతో దులమాగునన్న గీ
తానినదంబు లల్లుకొను తావు పవిత్రముగాక యుండునే?

దుఃసుగా బారు ఇంద్రియాదుల నడంచి
అస్థిరంబగుదానికై యడర విడచి
సకల సుఖదుఃఖముల యందు సంచలింప
కుండు సిద్ధాత్మునకు దాతృపండు గీత.

పరమ గీతారహస్యము నెరిగి యంచి
త స్థితప్రజ్ఞచేత మహాత్ము డయ్యె
కర్మవీరుడు లోకోపకారి గాంధి
చెప్పగా నేల పూర్వుల జీవితములు.

ఇలను గీతాప్రచారంబు సలుపువారు
పుణ్యపురుషులు సర్వత్ర పూజ్యు లగుట
సందియము లేదు, విఘ్నము సల్పువాడు
ధర్మ విద్రోహు లనుటయు తప్పు గాదు.

కనగా హైందవ చిత్తశుద్ధి కిది తార్కాణంబు మోక్షంబునై
న నపేక్షింపక ధర్మ నిర్వహణయం దానందమున్ పొందు సా
ధనమే పావనమైన దన్న శుభ గీతానాదము న్నమ్మి జీ
వనముల్ దిద్దగ నెంతు రియ్యదియె దేవత్వంబు చింతింపగన్.

ఆది మధ్యాంతములు లేని యట్టివాని
నరయ నాశ్చర్యముగ దోచునట్టి వాని
నాత్మయను వాని దెలుపు గీతాలతాంగి
అందుకొను మమ్మ. మా ప్రణయాంజలులను.

# నా పా ట

పాడుకొందును బ్రతు కొక పాట జేసి,
లోకమున కేల నాపాట లోని మనసు
మనసు నీరయ్యె ననుచు యేమనిసి యెరుగు
యెవ డెరుంగక, పిసిగింప నేల నన్ను?

పాడుకొందును యేడ్పొక పాట జేసి,
లోకమునకేల నాయేడ్పులోని జాలి
జాలి నీలాబ్ధమని కనజాలు నెవడు
యెవడు గనలేక వ్యథియింప నేల నన్ను?

పాడుకొందును నవ్వొక పాట జేసి
లోకమున కేల నానవ్వులోని సొగసు
సొగసు అగుపించదని యెంచి చూచునెవడు
యెవడు జూడక రాపాడ నేల నన్ను?

పాడుకొందును వల పొక పాట జేసి
లోకమున కేల? నా వలపులోని విలువ,
వలపు విలువ కందని దని తలచు నెవడు,
యెవడు తలపక, నలయింప నేల నన్ను?

చూచిపోయెద తలపునే సొగసు జేసి,
వలచిపోయెద మనసునే విలువ జేసి,
నవ్విపోయెద లోకంబు కవ్వ జేసి,
పాడిపోయెద బ్రతుకొక పాట జేసి.

# నా బ్రతుకు

నా కళాజీవితానంద నందనమున
ఎవ్వరో విషసర్పాలు రువ్వినారు
తేనియలు జిల్కు సుకుమారమైన హృదయ
కుసుమమున వేయి కంటకాల్ గ్రుచ్చినారు.

నా యనురాగపుం బొలములం దణుబాంబులు ప్రేల్చు దుష్ప్రచా
రాయుధులార? మీకు హృదయంబులు లేవొ, మరెంచు కీర్ష్య యీ
గాయము లారిపోక చిరకాలము నిల్వగ నెంచె, మీ పశు
ప్రాయపు వృత్తి జూపెడి నెపాన ప్రతిక్రియ ఇద్ది మీకగున్.

ఏడువనిండు నా బ్రతుకునెల్ల నెడారుగ జేయు మూర్ఖులన్
గూడిన తిక్కగొఱ్ఱియల గుంపువలెన్ పరుగెత్తునట్టి ఈ
పాడు ప్రపంచముం గని ఉపాయము వేరు తలంపలేక, న
న్నేడువనిండు నాకనుల నెవ్వరు చూడక యుండునట్లుగన్.

కనులు గరుగంగ నశ్రువుల్ గార్చిగార్చి
మనసులో నున్న వెతలను మార్చిమార్చి
భగ్నజీవుల కేడుపే బ్రతుకటంచు
విడ్వగానిండు నా యాశ లెల్లపీడి.

పువ్వునై నవ్వి మధుర జీవులకు మధువు
బోసి కమ్మని గంధంబు పూసిపూసి
రాలిపో నెంతు శిశిరమ్ము రాకమున్న
పండునై రాళ్లచే గొట్టువడగ నేల?

# స్వాగతము

కన్నులులేని లోకమునకై వెలి పేటికి సాగుమోయి నీ
కున్న రసార్ద్రచిత్త మదియొక్కటి చక్కగ విప్పి వేగ వి
చ్ఛిన్నములై తమస్సులు నశించును నీ వకలంక భావసం
పన్నుడవన్న సత్యమిల ప్రాకు దిగంతములు న్వెలుంగగన్.

నెగ్గెద వీవు ధైర్యమున నిల్వుము నీ పథమందు లోకమే
మ్రొగ్గును నీ పవిత్రమనమున్ గుణముం బరికించి చూచి నీ
కెగ్గొనరింప జాల దెవరెంత దుమారము రేపజూచినన్
నిగ్గులుదేరు నీదు కమనీయ కళాపరిపూర్ణ కౌముదుల్.

దోసము లంటనేరని మృదుత్వము నీయెడ నున్న దాత్మవి
శ్వాసము పెంచుకొమ్మదియ చాలును సర్వజనానురాగ హే
లాసముపేత జీవన విలాస వికాసములెల్ల నీదు సా
వాసము గోరి పర్వులిడివచ్చు వియచ్చర కాంత లట్లుగన్.

# సంవిక్త

## కవి

మూడు పీడల నుండి విముక్తి జెంది
జారిపోయెడి కొంగు సింగారములను
సర్దుకొని పర్వులెత్తెడి చంచలాంగి
యెవ్వతెవు నీవు ఈపర్వు లెంతవరకు.

## సంవిక్త

అదుగొ తూరుపుదిక్కు అరుణరేఖలు జూడు
బంగారు కిరణాల పొంగు స్వేచ్ఛలు జూడు
మాయక్క హస్త పద్మానురాగము జూడు
ననుజూడు నావెన్క వినిపించు ధ్వని జూడు.

## ధ్వని

ముచ్చటదీరలేదు మధుమోహము లారగలేదు నీదు గో
ర్వెచ్చని కౌగిటన్ బ్రతుకు వేడెద మింకొక యైదు పూటలున్
వచ్చి కసాయివా రనుచు పర్వులు పెట్టగ నేల? బేల ఘో
వచ్చునె నీకు మా వలపుబంధములన్ దెగద్రెంపు జేయుచున్.

## పిలుపు

చెల్లెలా రమ్ము మన ప్రేమజీవితమ్ము
లొక్కటిగ జేసి సహజసంయోగ గీతి
కలను బాడుద మిలయెల్ల జలదరింప
కావ్యమున కభిమానంబు కట్టువడునె?

## ధ్వని

ఆగుమునింకముం దరుగు టక్కరలే దొకకోటి మంది బై
రాగుల జేసి పోదువె నిరాశలలో నలయించి యింక ముం
దేగతి గల్గునో తెలియ దింతకు బిచ్చపుచిప్ప చేతికిన్
దేగలవో! దురాశ గల తెల్వికి నమ్ముడువోయి సుందరీ!

## పిలుపు

కనుల రెంటిని ముత్యాల గనులు జేసి
నిలచితి విదేల! సోదరీ! నీ మనస్సు
గరిగి నీరయ్యెనా......
ఇట్టి కరుణ గొలుపు
మాట లాడెడి వారి కేమాత్రమైన
జాలి గలదొకో నిమ్న జనాళిపైన
ఇన్ని నాళ్లుండి నీవు గ్రహింప లేదె!

పొత్తులపొయ్యి విచ్చుకొనిపోయెను నీవొక చిన్నదానికై,
పెత్తన మిచ్చగించుటయె బేలతనం బిక చెప్పదగ్గ సం
పత్తియ లేదు, స్వార్థ పరిపాలన యందు నలింపు జెందు నీ
చిత్తము శీలమున్ మధురజీవన మిన్నియు నోర్చు కొందువే!

## కవి

మా తెలగాణలక్ష్మివి సుమా! అసమాన యశంబు నేడు నీ
చేతుల నున్న దయ్యది కృశించి నశించునొ రాజకీయ దు
ర్నీతిని జిక్కి జిత్తులను నేర్వని మాకొక భాషకై యవ
ఖ్యాతిని గూర్తువేమొ! కలకాలము మాయనిమచ్చ పోలికన్.

## సంవిక్త

నిలుతునా మాయక్క పిలుచుచున్నది చూడు
సహజానురాగంబు జంపుకొనగా లేను
పర్వెత్తి పోదునా ప్రణయసంబంధంబు
తెగిపోవు నాకెద్ది తెర్వు? తెలుపుము కవీ!

## కవి

నన్నడుగంగ నేల? కరుణాకలలోచని సామ్యజీవ సం
పన్నముగాక, మా వెనుకబడ్డ ప్రజాధిక మొక్కసారి నీ
కన్నులజూడు మశ్రువులు గారునొ! లేదొ! మరింక నీవు నెం
దున్నను యేమి నీ హృదయ మొక్కటి వారల కీయజాలుచోన్.

# శరత్కామన

ఎవరో! ఆకసము నెక్కి
భువిదాక, కరాలు విప్పి
చల్లని అమృతంబు వెద
జల్లినారు జగమునిండ!

సకియా తెల్లని మల్లెపూవు లెదలో జన్మించి పుష్పించె కో
రికలై యేరుకొనంగ రమ్మివి శరచ్ఛ్రీగంధ సంబంధముల్
ప్రకట స్నేహలతాలవాలమయి, శుభ్రజ్యోత్స్నా నూత్నాభిసా
రికగా. మారిన దేకలానిధిని, దర్శింపంగ నూహించెనో!

మంచుముత్యాల పచ్చంచు తెల్లనికోక
సైకత శ్రోణుల సర్ది కట్టి
కొండలవలె నుబ్బు కుచములు బిగియంగ
నవ తమాలపువన్నె రవిక తొడగి
నీల వియద్వేణి నిండగా జాజికో
రకముల వోలె తారకల బొదివి
చంద్రబింబం బద్ది సవరించి నుదుటిపై
బంగారు తిలకంబు బ్రస్తరించి

కలువపుప్పొడి పారాణి కాళ్ల నలది
హృదయ మొక పాలవెల్లియై కదలుచుండ
యెదురు చూచుచు నున్నది యెవరి కొరకొ,
పరమపావని గనుమదే ప్రకృతిలక్ష్మి.

కొదువయె లేమ కోమలి, చకోరికి, నెచ్చెలికాని మోహమున్
వదలక సొక్కజేయు మధువట్టుల వెన్నెలపాలు వోయుచున్
గదిసి సుఖించు జీవితము కల్పకమై నవకంబులీన నొ
క్కడినమె చాలదే బ్రతుకు కమ్మగ దోచిన వేయి యేటికిన్.

నిద్రలువోవు నేడు తరుణీ హరిణీ తతులెల్ల చంద్రికా
ముద్రిత శాద్వలంబుల విమోహితలయ్యె కురంగలించి చం
చద్రుచిరేక్షణంబుల రసాత్మకులౌ పతులం గలంచుచున్
భద్ర నికుంజపుంజముల బారి సుఖింపుచునుండు నిచ్చలున్.

పన్నగముల్ వయో మధురభావనలన్ గుబుసంబు లూడ్చి, ఈ
వెన్నెల నీడల న్వ్రిపిన వీధుల బచ్చుబయళ్లలోన పే
రెన్నిక గన్న పూవుల స్థరస్తటినీ పులినాత్త సౌఖ్యసం
పన్నములైన మేను లెడబాయని కూర్మి రమించు నెప్పుడున్.

చందురుని వొంద నుప్పొంగు జలధులెల్ల
పరిమళము గోరి పవనుండు పరుగులెత్తు
నీలమేఘుడు ఆణిముత్యాలు జల్లి
అందములు కుస్తరించు వసుంధరకును.

ప్రణయ సంజనితోద్వేగ భావములను
దాచుకొన జాలనట్టి చిత్తముల జెలగి
యెల్లప్రాణులు సంయోగ మిచ్ఛగించి
యలరు నీశరజ్యోత్స్నక యందు రమణి!

# వేయిస్తంభాలదేవాలయము

ఱాల తరళించి నిల్వుటద్దాలు జేసి
నిల్పితివి శిల్పి శివుని మందిరము నందు
మానవుడు నీ కళాస్నిగ్ధ మానసమును
తెలియలే డను శంకయే గలిగె నేమొ!

ఒక్కటి రెండుగాదు శ్రమకోరిచి యోపిక బెంచి స్తంభముల్
జెక్కితి వొక్కవేయి, యవి చేతులా వజ్రపు టమ్ములేనొ! నీ
చక్కదనాల సృష్టికి రసజ్ఞులు జోత లొనర్చినా రదే
నిక్కపు దైవతంబు రమణీయ కళాకలితంబు గావునన్.

నీయులిముక్కులో నొదిగి నిల్చెను దేవతకోటులెల్ల దీ
ర్ఘాయువు లందుకొన్నవి మృగంబులు పక్షులు పూలు తీగలున్
పాయగలేదు సప్తశతవర్ష పరిభ్రమణంబులందు లే
బ్రాయపు టందచందములు బ్రహ్మ యెఱుంగునె నీ రహస్యముల్.

జాతిని వెన్న జేసి అనురాగము వోసి సృజించినావు నీ
చేతులతో స్వయంభువు సజీవముగా గుడిముందు నందికిన్
ప్రీతిగ మువ్వ లందియలపేరులు పూసలు గూర్చి నీకళా
చాతురి చాటుకుంటివి యశస్సులు కుప్పలువోసి చూపుచున్.

ద్వారముఖంబులందు శివతాండవ దృశ్యము లెట్టి కౌతుక
శ్రీ రచితంబులౌనొ, చమరీమృగముల్ పురివిప్పి నృత్యవి
స్ఫార పరిశ్రమం బుడుపసాగునొ, ఆనటరాట్టు కెల్ల బృం
దారక బృందముల్ జయనినాద మొనర్తురొ యేమొ దిగ్భ్రమన్.

మంజులంబగు కల్యాణ మంటపమున
నుపరిభాగాన గాయత్రి నునిచి చుట్టు
నష్టదిక్పాల వరులను సృష్టిజేస్తి,
అందుకొన్నావు విశ్వకర్మాంశ నీవు.

మూడు గర్భాలయాల మున్ముందు లలిత
లలితముగ నష్టదళ కమలాలు దీర్చి
అలరజేసితివౌ సరసాళి నెల్ల
బండలో తేనియల నెట్లు పిండినావొ!

ఇది కాకతీయ భూమీశుల మధుర హృ
ల్లీలల జూపు అద్దాల మహలు
ఇది తెన్గు శిల్పయోగీంద్రుల భావనా
లోకంబులోని పద్మాకరంబు

ఇది ఓరుగంటిలో కదలిన చిరుగజ్జె
లందవచ్చిన వేల్పుటాంధ్ర వసతి
ఇది హైందవైశ్వర్య పదవికి దాసియై
ప్రకృతి సంస్కృతి గన్న వర్ణశాల

ఇది చిదానంద దుగ్ధముల్ పిదుక జేయు
ధర్మధేనువు యీనిన తావు ఇదియ,
వేయిస్తంభాలగుడి యను పేర వెలసి
నిలుపుకొన్నది దివ్యస్మృతులను కొన్ని.

ఎవరురా ఈశిలా నవనీత సృష్టిని
చెరచి నిర్జీవంబు చేసినారు,
ఎవరురా ఈతెన్గు పువుదోటలో జొచ్చి
కుసుమాల సొగసులు గోసినారు,
ఎవరురా ఒక కళాహృదయంబు నిరతి
ముక్కముక్కలుగాగ జెక్కినారు,
ఎవరురా విశ్వమానవ నాగరికతకౌ
దలమానికము నుగ్గుసలిపినారు,

అది మతోన్మాద మిదికళ అచటి కిచటి
కెంత దూరము పశువుల కేమి తెలియు,
వేయి పాదుల పొలమును మేయునాడు
ఎవ్వ డున్నాడు కృషిఫల మెరుగువాడు?

ఎన్నడు రుద్రదేవు డుదయించు పున శ్శిథిలావశిష్టమై
యున్న మనోజ్ఞ శిల్పముల కూపిరివోయు నెవండు సద్యశ
స్స్విన్న గళంబులన్ తెనుగుజీవన మొక్క రసార్ద్రగీతమై
యెన్నడు మేలుకొల్పు నిదురించెడి కాల్పనికప్రపంచముల్.

# రాయప్రోలు

వంశిన్వంచి, మృణాళముస్మెలిచి, ఁగజ్ఞశ్రీల నేలన్ దశ
త్రింశల్లక్షజనప్రసన్నరసనా దేవాలయాభ్యంతర
ప్రాంశు ప్రార్థనగీతమున్ బలుకు మారాయంచ నవ్యాంధ్రగీ
ర్వాంశ ప్రేమమయూరమా! నతులు సుబ్బారాయవిద్వత్కవీ!

లలితా లాపము లందు నీ ప్రణయలీలా మానుషత్వంబునే
తలపం జేసితివేమొ, నీ ప్రకృతిసౌందర్యార్చనానంద మం
గళగీతంబులు పాడపాడ పికబృందమ్ముల్ రసావృత్తిచే
కలకంఠంబుల పేరు లందినవి లోకఖ్యాతి నార్జింపుచున్.

పాడితివీవు తల్లియగు భారతి ప్రేముడి నొక్కనాడు, పో
రాడితి వొక్కవేళ భరతావని దాస్యవిముక్తి కయ్యె కా
పాడితి విన్నినాళ్లు పసివాడెడి యాంధ్రకళాప్రశస్తి, రా
పాడితి వెన్నడున్ తెనుగుపల్కున తేనియలూర జేయగన్.

అమరావతీపట్టణాంధ్రబౌద్ధుల విశ్వ
విద్యాలయాలను వెదకి వెదకి,
కృష్ణాతరంగపంక్తిన్ దేలియాడిన
ఆంధ్రనౌకల చొప్పు లరసియరసి
పొట్నూరికి సమీపమున దిగ్జయస్తంభ
మెత్తిన పౌరుష మెంచి యెంచి
విద్యానగర రాజవిధుల గప్పిన
పెండ్లిపందిళ్లకు బిలచి బిలచి

ఆంధ్రవిజ్ఞాన నందనోద్యాన జనిత
చందన సుగంధఝురుల మజ్జనములాడి
చల్లినావాంధ్ర జగతి నక్షతలు మున్నె
రాయప్రోలు కవిబ్రహ్మవోయి నీవు.

కావ్యోల్లోలినిగాక నిల్చిన దహో కల్యాణి నీవాణి, నీ
రమ్యాలోకన గేయగుచ్ఛముల నారాధించి రెండింటికిన్
సామ్యంబౌ "తృణకంకణ" ప్రకటదీక్షాధారివై సాహితీ
సమ్యజ్ఞానము బొందినావు కవిరాట్చంద్రా నమోవాకముల్.

# దాశరథి

ఎవడు మాతెలగాణ మెల్ల దిగ్గున లేచి
యురికివచ్చెడి యట్టు లరచినాడు
యెవడు దౌర్జన్యంపు టెదల నిప్పులు బోసి
'అగ్నిధారా'కృతి నలరెనాడు
ఎవడు ప్రజాకోటి యెత్తిన దివ్వెయై
తెలుగు బాటలయందు వెలిగినాడు
ఎవడు రాక్షసుగుండె లవిసి నీరై పోవ
గద్దించి నీతులు గఱపినాడు

చెలగి కాళోజితో గొంతుకలిపి పాడి
బోనులో జిక్కు సింహంపు బొబ్బవెట్టి
పశుబలాలను గగ్గోలుపరచి నట్టి
కవియెవడు? నాడు నీవ యొక్కడవు గాక.

నీలో నాంధ్రసరస్వతీచరణ మంజీరధ్వనుల్ మ్రోగె నే
లీల న్నీ తెలగాణవీణకు, స్వరాలెక్కించియున్ కోటి ర
త్నాలన్ గూరిచి యెల్లుపాడితివి. నీనాదాలు బ్రహ్మాది లో
కాలన్ దాటగజేయు మైకు నెటులన్ గల్పించినావో కవీ!

విడియునైన ముందెవచియించెడి ద్రష్టవు నాటి నీ 'మహాం
ధ్రోదయ' మద్ది నేడయినదోయి, తలంపగ నెట్టిపూజయున్
గాదు, సుమా! జగద్ధితము గాంచు మహాకవియాట జన్మ జ
న్మాది తపఃఫలంబు లవి యన్నియు నొక్కెడ గూడకుండినన్.

ఏ ధన వంతుసేని వరియింపదుబో సుకుమారి నీ 'మహా
బోధి' రసజ్ఞతాప్రయణమూర్తిని బూర్గులరామకృష్ణ రా
యాధిపు మెచ్చె నేడుగడియల్ గడువిచ్చియు నల్లునిన్ గళా
రాపకు బిల్వబంపు కవిరాజు మరొక్కడు గల్గనేర్చునే?

'దాశరథీ మనోజ్ఞ కవితాశరథీ' యని పిల్చ గేయవా
రాశి యొసంగె నొక్క మధురంబగు కావ్యము కాన్కగా ప్రసి
ద్ధాశయసిద్ధి బొంగెడి సురాపగయా భవదీయ భావనా
వేశము కంజలింతు సుకవీ! మరి యే నొక సోదరుండనై.

# బుద్ధం శరణం గచ్ఛామి

దేవా! శాక్యమునీంద్ర బౌద్ధశరణార్థిన్ తావకీ యాంఘ్రిరా
జీవ స్నేహసుఖప్రమత్త నొకదాసిన్నన్ కృపాదృష్టి సం
భావింపం దగదా? గతంబెరిగి సమ్యజ్ఞానమున్ గల్గియున్
నీవే సేవికయౌ యశోధరను సందేహింతువా సంయమీ?

మరచితిసుమ్మి నా ప్రణయమానసహంసను హంసతూలికాం
తర మధురప్రపంచ మెదదల్చను సుమ్మి యొకప్పుడేనియుఙ
స్ఫురణకురావు సుమ్మి సుమపుంజ లతావృతమైన యా మనో
హర హరితంబులం దురుకులాడిన వేడుక లొంటివేళలన్.

లాలనా లోలమైన వరాల మనసు
మేలి బంగారమును మించు మేని సొగసు
వలపు లూరించు పూగుత్తి వంటి వయసు
లేదు, లేదు, లేదెద్దియు లేదు నాకు.

ఉన్నా డొక్క సుతుండు గౌతముని విద్యుత్సామ్య సంయోగ ని
ష్పన్నంబైన ఫలంబుగా నతఁడు వంశం బుద్ధరింపంగ లే
కున్నంగాని, విచార మెప్పుడును లే దొక్కింత నా కింక. మీ
సాన్నిధ్యంబు లభింప జాలు సుమి నాజన్మంబు ధన్యంబగుఁన్.

మహిత శ్రీవిలసత్ప్రసిద్ధ తతసామ్రాజ్యంబు శశ్వత్సుఖా
వహముల్ సుందర హర్మ్యముల్ లలిత పుష్పారామముల్ సత్సరి
ల్లహరీ శైత్యము లింద్రభోగములు కాలందన్ని సన్యాసివై
విహరింపన్ భవదీయ దాసి సుఖ మన్వేషించునే బేలయై?

తొలినాడే గనుగొంటి నిన్ను కరుణాతూర్ణాబ్ధిగా నార్తజీ
వులకై కన్నుల నీరు నింపుకొను చొప్పున్ గాంచి, యేకాంతవే
ళల శృంగార రసోచిత ప్రణయలీలన్ దక్కి నిర్వాణచిం
తలలో నున్నపుడే గ్రహించితి జగత్కల్యాణముల్ నీ యెదన్.

సహజంబుల్ నవలాజనంబులకు సత్సంసార మోహమ్ములి
మ్మహి నిల్లాలిగ నర్థమౌ ప్రణయ సంబంధంబులం జిక్కి ని
న్నిహసౌఖ్యంబుల ద్రిప్పజూచితిని తద్వృత్తంబు లివ్వేళలన్
విహితంబౌనె తలంచి చూడగ కృపాపిష్టుండవౌ మౌనివై.

సత్యము, శమంబు, దయ, అహింసావ్రతంబు
లలవడెను పతి సాహచర్యమున మున్నె
పతి వియోగమునఁ త్యాగబలము గంటి
చాలనే యింక బౌద్ధభిక్షును గ్రహింప?

(సంఘారామములో త్రిరత్నాల ధ్వనులు)

బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
బుద్ధం శరణం గచ్ఛామి.

---

# పరివర్తనము

అరయుగ పంచవింశతి శతాబ్దము లల్లిన ఐతిహాస పం
జరమ్ము పునామలం దొదిగి శాంతి యహింసలు దారిజూప పా
వురములు రెక్కలార్చుకొని బుఱ్ఱునలేచె సమస్తలోకముల్
దిసుగుమ స్నేహధర్మ ముపదేశము జేయు తలంపు పెంపునన్.

కోరలుసాచి మానవుల గొంతుకల న్నులివెట్టి ఘోర హిం
సారుణితాట్టహాసములు సల్పెడిదౌ యణుశక్తి గుండెలో
దూరెను పావురాళ్లు, వ్యథతో తలవంచి కృశించి, నేడహిం
సా రమణీయ దీక్షకు వశంబయి మూలుగుచుండె నద్దియున్.

ఈ వైశాఖ సితాతపత్రమయినా డిందుండు శీతామృత
ప్రావృట్సూచన లిచ్చె మేఘములు విశ్వప్రేమకుఁ జల్లగా
తీవల్ సాగిన వేపురాస్మృతుల నుద్దీపించెనో శాంతియుఁ
బూవుల్ వైచిన దచ్చుటచ్చుట సుహృన్మోదంబు సంధింపుచుఁ.

కాలమాయా సుఖస్వప్న గర్భమందు
మెఱపు దోచెను మఱల జన్మించు నేమొ
బుద్ధదేవుడు భువనైక పుణ్యమూర్తి
భారతీయ యశస్సుల పంటయయ్యె.

రాజకీయ ప్రపంచ సంగ్రామ మందు
ఈ మనఃపరివర్తన మేమి? తిరిగి,
లోకకల్యాణమునకై యశోకచక్ర
దివ్యరోచిస్సు లవి బయల్దేరు నేమొ!

# తండ్రీ!

నీవు కవితామరధునీ పునీత మతివి
నీవ యవని జ్యోతిశ్శాస్త్ర నిధివి సుధివి
నీవ ఆధ్యాత్మి కానంద జీవనుడవు
నీవు లేవేల? మాకు తండ్రివిగ నేడు?

అప్పుడె నిండిపోయెనె శతాయువు నీకు పురాకృతంబులొ
యప్పులు దీర్చి యేగితె మహాఘనిబద్ధ జగంబునుండి యే
చప్పుడులేక నావలకు జారితివేమరియింక, నీవు మా కెప్పుడు
గానుపింపవట యెందుల కీదయలేని చర్యముల్?

కొడుకొకడు నిన్ను కాపాడు కొనగ దలచి
యన్నకడ జేర్చి తా దృప్తి నందినాడు
కొడుకొకడు నిన్ను దక్కించుకొనగ లేక
అమితమగు వ్యథచేజిక్కి కుమిలినాడు

మూగబిడ్డలు అమ్మతో ముచ్చటాడి
"యేడి మాకాక?" యనుచు వ్రేలెత్తి నపుడు
ఏడ్వవే చెట్లు గుట్టలు నెల్ల ప్రకృతి
ఏడ్వడే దేవుడైన దా నింత జేసి.

జాలిగలవాడ వీవు నీ సంతతికిని
సహజమది యింక మూక వాత్సల్యమునకు,
సరసిగా, తటాకంబుగా, సాగరముగ,
నెదిగినది దాని నెవడు బంధింప గలడు?

ఈవు ఆత్మానుమోదివి యేను లౌకి
కప్రయోజన మెంచెడి కాముకుండ
నెద్దియేని నీతృప్తికై యే నొనర్ప
జాలితినయేస ధన్య మీజన్మ మెల్ల.

ఎట్టి ఆశలు నాయందు బెట్టు కొనుచు
నరిగితివొ వాని నెరవేర్చు నట్టి శక్తి
గలిగి పుణ్యాశ్రయుండునై మెలగు నటుల
నన్ను దీవింపు మీ నాడు కన్నతండ్రి.

## ఆవేదన

చూడగ నోపదు దుఃఖము
నేడుపు వినలేను బాధలెవ్వరు పడినన్
వాడి కృశించును మాన స
మోడుదున పవిత్ర నిష్ఠురోక్తుల నాడన్ !

ఎందుకు జాలిచే నలమటించెడి పుట్టుక గల్గెనాకునా
యందిది విశ్వశాంతి కొరకై ప్రవహించు నుపాయమెద్ది ? యా
క్రందనమయ్యి పొంగు యనురాగము నెట్టులమల్చు సత్యమున్
సుందరమున్ శివంబగు విశుద్ధ సుధాధునియై స్రవింపగన్

ఏదియొబాధ నా హృదయమెల్ల వ్యథించును, అందునెద్దియో
నాదము నవ్యషట్పదమొనర్చు గరుత్స్వనమట్లు మీదికిన్
రాదు, లయించిపోదు, మధురప్రణవాకృతి నెన్నడీ మహా
వేదన విశ్వతోముఖ పవిత్ర కలారవమై ధ్వనించునో!

నే నొక కీచురాయిగ జనించి రసార్ద్రమనోజ్ఞ మంజుల
ధ్యానము లీనుచెట్టుల వృథాయగు నేటి కళా పరిశ్రమల్
మానితపింతునే మధుపమై జనియింపగ నప్పుడైనయీ
తేనియలొల్కు పూలతమిదీరగ చక్కిలిగింత సేయనే!

ఆశయసిద్ధికయ్యె కవినై మరలం జనియించి దివ్య సం
దేశమొసంగి స్వర్గములదెత్తును పుట్టినచోటి కింక, ఆ
కాశము లోనితారకల నన్నిటి నేరుకవచ్చి యొక్కచే
రాశిగ బోతునా తెనుగుప్రాంగణముల్ రతనాలకొట్లుగాన్!

## నా మామ

ఎందులకు నీ మనస్సు మరందమొలుకు
ప్రసవముగ సృష్టిజేసెనో పద్మజుండు
కలిగెనేటికి నీకుపకార బుద్ధి
మానవుడు దేవుడను చాటు మాటకొఱకొ!

నిరుపేద నని జెప్పి నిను జేరువానికే
బంగారు బ్రతుకు నొసంగినావు
ఇల్లువాకిలిలేక నల్లాడు వానికి
నంచిత వసతి గల్పించినావు
చదువుసంచెలపొత్తు కుదురని వానికి
సత్కళాదీక్ష నొసంగినావు
లగ్నఫలంబు దుర్లభమంచు నిస్పృహ
జెందువానికి పెండ్లి జేసినావు

కటిక కోతకు తలవంచి కలగిపోవు
బక్కగోవుల పెక్కింటి ప్రాణములను
జాలిజెందుచు కాపాడ జాలినావు
నీ వొక మహాత్ముడవు నవనీత మతివి.

ఆప్తప్రాయులు బ్రాహ్మణోత్తములు నీ కొనంద మవ్వారలున్
తృప్తిం జెందిరయేని భాగవత సందేశంబులున్ తత్కథా
సప్తాహంబులు నీకు పండుగలు నిస్వార్థంబు నీయందు ని
ర్లిప్తంబైన ధనంబు సత్యమును సౌశీల్యంబు నీ వర్తనల్.

నన్ను కరుణించినా వొకనాడు నీవు
నిన్ను ప్రేమింతు నాప్రాణ మున్నవరకు
యీవు లోలోన నన్ను దీవించినావు
నేను కవినయ్యి నిన్ను కీర్తించినాను

ఏనాటి పుణ్యమో నీ
మానసమున నాకు లేశమాత్రమె యయినన్
స్థానము లభించినది నా
చేనైన త్వదీయ సేవజేసి తరింతున్.

# సురవరం ప్రతాపరెడ్డి

తెనుగు ప్రజాకవి బంగరు
కనులుం జెమ్మగిలె నేడు కమనీయ కలా
ధుని అనుముల సుబ్రహ్మ
ణ్యుని మనసు ద్రవించెనే నినుఁ మఱచుటకుఁ.

ఒక్క రనుయాయి మిత్ర మింకొక్క రగుట
ఎరుగుదురు నిన్ను నీ మృదుహృదయ మెల్ల
రచయితగ పండితాదర్శ రమ్యమతిగ
నిన్ను మఱచిన కవిని మన్నింతు రెట్లు?

నను క్షమియింపు తెన్గురతనంబ రసార్ణవులైన సాహితీ
ధనులకు ప్రీతిపాత్రములు తావక దివ్యగుణానుకీర్తనల్
వినియును విస్మరించితి కవిన్ రసరాట్టు విమర్శకున్ హిత
జ్ఞుని నిను రాజకీయ పరిశోధకు నెవ్విధి సంస్తుతించుటల్.

నీవు హైందవ ధర్మనీరధిలో జొచ్చి
తేలించినావు రత్నాలు కొన్ని
నీవు రామాయణ నిగమంబు వడబోసి
తరళించినావు సత్యములు కొన్ని
నీవు మా యువజన జీవనంబులు దిద్ది
వెలిగించినావు దీపికలు కొన్ని
నీవు హంవీర కావ్యావనీజము బెంచి
పండించినావు సంపదలు కొన్ని

'గోలకొండ'వు నీవ గాకుందు వేని
వెలుగు నెట్టు లీనాటికి తెలుగుకీర్తి
రాలరప్పల నెల్ల వరాలు జేసి
అన్నిటికి నీవ జీవమై అలరినావు.

అది మహాంధ్రోదయంబయ్యె యద్వితీయ
కావ్యమై దాశరథి మహాకవి కృతమయి
అతుల విజ్ఞాన నిధికి నీ కంకితమయి
అమర మైనది నీపేరు నందగించి.

తెనుగు సాహితీస్వర్గంబు తెచ్చుకొన్న
"వేల్పుగిడ్డివి," నిజము పవిత్రజీవి
తాశయమున వెల్గొందు విద్యాభినవమ
రీచి వమరుండవు ప్రతాపరెడ్డి నీవు.

నీ వొనరించినట్టి రమణీయ కళాపరిశోధనంబు నా
నా విషయానురూప రచనాత్మక సంస్కృతి సంస్కృతాంగ్ల భా
షావిరళ ప్రభావమున జారని తెన్గుదనంబు కల్పనా
భావ నిమగ్న చిత్తమున బ్రస్తుతిసేతు నపూర్వ రీతులన్.